114/2-26

శ్రీ

# హనుమాన్ చాలీసా

(స్తోత్ర-దండకములు)

మరియు

## శ్రీకృష్ణ బోధామృతసారము

(అష్టాదశశ్లోకీగీతా)



1281 UDC
Rop

294.592
TUL

రచయిత :

బాపట్ల హనుమంతరావుగారు

ప్రచురణకర్త :

బాపట్ల వేంకట పార్థసారథి

శ్రీసాయీ నిలయమ్. చెరువు. (P.O.)

గుంటూరు జిల్లా.

సర్వహక్కులు ప్రచురణకర్తవి.

1965 మొదటికూర్పు 1000 ప్రతులు

1967 రెండవకూర్పు 1000 ప్రతులు

1977 మూడవకూర్పు 1000 ప్రతులు

శాస్త్ర గురుబోధలను మఱి స్వానుభవము
కలిమి, నెద్దాని నరుఁ డేమఁగడఁగ నమ్మ
నదియె శ్రేష్ఠంబుఁ బరమమౌనదియు, యదె జ
గంబునన్ వాని కవలంబనంబు-సాయి!....

రచయిత.



శ్రీ

# హనుమాన్ చాలీసా

(శ్రీ గోస్వామి తులసీదాస్)

శ్రీరామచంద్ర ప్రభాతీ - సాయంకాలికీ వందన-

శ్రీ రామాయణ ఆరతీ - శ్రీ హనుమాన్ స్తోత్ర - దండక

సహితము.





రచయిత :

కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరావుగారు

ప్రచురణకర్త :

బాపట్ల వేంకట పార్థసారథి

శ్రీసాయీ నిలయమ్. చెరువు. (P.O.)

గుంటూరు జిల్లా.

Acc No 6796

కలి సంతరణమహామంత్రము

హరే! రామ! హరే! రామ!

రామ! రామ! హరే! హరే!

హరే! కృష్ణ! హరే! కృష్ణ!

కృష్ణ! కృష్ణ! హరే! హరే!

హరే! సాయి! హరే! సాయి!

సాయి! సాయి! హరే! హరే!

హనుమానుని శరణందిన
యనన్యభక్తులయభీప్సితార్థంబులుతత్
క్షణ మొనఁగూడును, సత్యము-
కనుఁ! డివిపాషాణవజ్రఖచితాక్షరముల్.

రచయిత.

294.592 TUL

శ్రీ సాయినాథాయనమః

# విజ్ఞప్తి

సోదరీ సోదర భక్తులారా !

శ్రీ మారుతీ సాయిప్రభుని అనుగ్రహమున మీ అందర ప్రేమా దరణ వదాన్యతలవలన పూజ్యులు మాతండ్రిగారు కీ.శే. శ్రీ బాపట్లహను మంతరావు పంతులుగారు రచించిన శ్రీహనుమాన్‌చాలీసా - శ్రీకృష్ణబోధా మృతసారము అనుకృతులు వెలువరించు భాగ్యము నాకుకలిగినది.

"శ్రీహనుమాన్‌చాలీసా" అన 'హనుమంతుని—నలుబది' నలుబది చౌపాయిలలో శ్రీహనుమంతుని కీర్తినివివరించు స్తోత్రము. ప్రతిజీవియు లోకమున కష్టనివృత్తి—అభీష్టావ్యాప్తి—సుఖసంతోషములఁ గోరుచుండును. సాధుసత్పురుషులు వారియనుభవములను లోకమునకు చాటుదురు. అట్టి వారి పలుకులే వేదములు—శిలాక్షరములు. వారియందువిశ్వాసము కలిగిఅను సరించు భక్తులకు దైవము అధీనుడై తోడ్పడును; అట్టిపరమ భాగవతో త్తముడగు శ్రీ గోస్వామి తులసీదాసు రచనయే 'యీహనుమాన్ చాలీసా', దీనిపారాయణము శ్రీమద్రామాయణాంతర్గత సుందరకాండ పారాయణ ఫలసమానమనులోక ప్రసిద్ధియగుటచే మాతండ్రిగారు దీనిని దండక ఫణితిని తెనిగించిరి.

ఈకృతిప్రథమముద్రణము రేపల్లె వాస్తవ్యులు శ్రీకస్తూరి భైరవ స్వామిగారు; ద్వితీయముద్రణము చీరాల వాస్తవ్యులు శ్రీ వి శేషగిరిరావు గారు ద్రవ్యసహాయముఁ జేయ ప్రచురణకాబడెను. ప్రతులన్నియు అప్పుడే

వ్యయమగుటచేత తిరిగి ముద్రణచేయించి శ్రీహనుమజ్జయంతినాటికి భక్తుల కందించుట సమంజసమని శ్రీసాయీ ప్రభువు సంకల్పము కలిగించెను.

మాతండ్రిగారు నిత్యము స్మరించిన శ్రీగోస్వామి తులసీదాసకృత 1. శ్రీరామచంద్రప్రభాతీ– 2. సాయంకాలకీవందనా 3. శ్రీరామాయణ ఆరతీ 4. శ్రీశంకర భగవత్పాద కృతమగు శ్రీహనుమత్పంచరత్నస్తోత్ర మును, శ్రీ మద్రామాయణాంతర్గత హనుమత్ స్తోత్రములుకూడ యిందు చేర్చబడెను

'శ్రీకృష్ణబోధామృతసారము' (అష్టాదశశ్లోకీ గీతా) యిందుప్రత్యేక భాగముగ ప్రచురితమైనది. శ్రీభగవద్గీతామృతము (శ్రీవ్యాసమహర్షిరచన) 18 అధ్యాయములనుండి 18 శ్లోకములనుగొని 'అష్టాదశశ్లోకీగీతా' గా మన పూర్వులేర్పరచిరి. ఇందలిభావమును పద్య గద్యరూపమున 'శ్రీకృష్ణబోధా మృతసారమ'ను పేర తండ్రిగారు రచించిరి. ఇది యిదివరలో ప్రచురణ జరిగియుండలేదు. ఇదియునిత్య పారాయణమునకుపయుక్తమగుననియిందు చేర్చబడెను. మాతండ్రిగారు 1924లో శ్రీభగవద్గీతామృతము తెనిగించి ప్రచురించిరి. ఇదియు పునర్ముద్రణ జరుగవలసియున్నది. శ్రీసాయీ నాధుని కృపకలిగిన, మీఅందరి సహాయ సంపత్తితో సఫలీకృతమనోరధు డను కాగలనని నా ఆకాంక్ష.

ఈ పుస్తకముద్రణకు తోడ్పడిన పోషకులకు శ్రీ సాయీ ప్రభువు చిరాయురారోగ్యభోగ భాగ్యవంశాభివృద్ధులను ప్రసాదించి అనుగ్రహించ నా ప్రార్థన.

శ్రీ సాయీనిలయమ్
చెరువు.
15-4-1977

ఇట్లువిన్నవించు
శ్రీసాయీభక్తపాదరేణువు
బాపట్ల వేంకటపార్థసారథి.

# పోషకులు

| | | |
|---|---|---|
| శ్రీ బొడ్డురామయ్యగారు. విశాఖపట్టణము | రు. | 50—00 |
| శ్రీ జి. రామకృష్ణగారు. కొవ్వలి. | ,, | 50—00 |
| శ్రీ యు. వి. యస్. శర్మగారు. Dy. Tahsildar మిర్యాలగూడ | ,, | 40—00 |
| శ్రీ పి. సుబ్బారావుగారు. సికింద్రాబాదు | ,, | 40—00 |
| శ్రీ బి. లక్ష్మీపతిగారు యమ్. ఏ. బియిడి; తాడిమళ్ళ | ,, | 40—00 |
| శ్రీ పి. వి. విశ్వేశ్వరరావుగారు మచిలీపట్టణం | ,, | 40—00 |
| శ్రీ యస్ సత్యనారాయణగారు. ఎ. ఇ: రేపల్లె | ,, | 30—00 |
| శ్రీ యల్. సూర్యనారాయణ శర్మగారు. బి. ఎ. మచిలీపట్టణం | ,, | 30—00 |
| శ్రీ వి. యన్. శర్మగారు. మద్రాసు. | ,, | 30—00 |
| శ్రీ జి. భీమరాజుగారు విజయవాడ | ,, | 28—00 |
| శ్రీ సి. యమ్. సాహుగారు. భంజనగర్. ఒరిస్సా | ,, | 25—00 |
| శ్రీ బాపట్ల శ్రీరామచంద్రసాయి. బొంబాయి | ,, | 25—00 |
| శ్రీ సిహెచ్. విస్సావధానులుగారు. బిక్కవోలు | ,, | 15—00 |
| శ్రీ పుల్లభొట్ల కృష్ణమూర్తిగారు. పెదకొదమగండ్ల | ,, | 12—00 |
| శ్రీమతి సి పద్మావతిగారు. గుంటూరు | ,, | 10—00 |
| శ్రీ యస్. వెంకటస్వామిగారు. కమలాపురం | ,, | 0—00 |
| శ్రీ యమ్. సాయిబాబాగారు ఏలూరు | ,, | 10—00 |
| శ్రీ టి. రామచంద్రయ్యగారు ప్రొద్దుటూరు. | ,, | 10—00 |
| శ్రీ బాపట్ల రాజశేఖరసాయి. బొంబాయి. | ,, | 10—00 |
| శ్రీ కిలుగు రంగారెడ్డిగారు. కందివలస. | ,, | 5—00 |
| శ్రీ పి. వి. కె. రావుగారు. వుయ్యూరు. | ,, | 5—00 |

శ్రీతులసీదాస కృత

# శ్రీరామచంద్ర ప్రభాతీ

## గణపతి వందన

గాయియే గణపతి జగవందన। శంకర సువన భవానీ నందన
సిద్ధిసదన గజవదన వినాయక।కృపాసింధు సుందర సబ లాయక
మోదకప్రియ ముదమంగళదాతా। విద్యావారిధి బుద్ధి విధాతా
మాంగత తులసీ దాసకరజోరే।బసహిఁరామసియ మానసమోరే.

## ప్రభాతీ-౧

జాగియే రఘునాథ! కుఁవర। పంఛీబన బోలే-
చంద్రకిరణ శీతల భయి। చకయీ పియ మిలనగయీ
త్రివిధ మంద చలత పవన। పల్లవ ద్రుమ డోలే. ॥జాగియే॥ ౧
ప్రాతభాను ప్రకట భయో రజనీకా తిమిర గయో
భృంగ కరత గుంజగాన। కమలన దళ ఖోలే ॥జాగియే॥ ౨

బ్రహ్మాదిక ధరత ధ్యాన। సురనరముని కరతగాన
జగనకీ వేర భయీ। నయన పలక ఖోలే. ॥జాగియే॥ 3
తులసి దాస అతి ఆనంద। నిరఖకే ముఖారవింద
దీననకో దేత దాన। భూషణ బహు మోలే. ॥జాగియే॥ ౪

ప్రభాతీ-౨

జాగియే కృపానిధాన। జాన రాయ రామచంద్ర!
జననీ కహే బార బార। భోర భయో ప్యారే!
రాజీవ లోచన విశాల। ప్రీత వాపికా మరాల
లలిత కమల వదన ఉపర। మదన కోటి వారే. ॥జాగియే॥ ౧
అరుణ ఉదిత విగత శర్వ। రీ శశాంక కిరణ హీన
దీనదీప జ్యోతి మలిన। ద్యుతి సమూహ తారే
మనోజ్ఞాన ఘనప్రకాశ। బీతే సబ భవ విలాస
ఆసత్రాస తిమిర తోష। తరణి తేజ జారే. ॥జాగియే॥ ౨
బోలతఖగ నికరముఖర। మధురకర ప్రతీత సునో
శ్రవణప్రాణ జీవన ధన। మేరే తుమ బారే-
భనై వేద బందీముని। బృందసూత మాగధాది
బిరద వదత జై!జై!జై!! జైతికైట భారే! ॥జాగియే॥ 3
వికసత కమలావళీ। సుచలే పుంజ చంచరీక
గుంజత కలకోకిల ధున। త్యాగ కుంజన్యారే-
మనోవిరాగ పాయ సలిల। శోక కూప గృహ విహాయ
భృత్యప్రేమ మత్త ఫిరత। గునత గునతి హారే ॥జాగియే॥ ౪
సునత వచన ప్రియ రసాల। జాగే అతిశయ దయాల
భాగే జంజాల విపుల। దుఖకదంబ టారే-
తులసిదాస అతి ఆనంద। దేఖకే ముఖారవింద
ఛూటే భ్రమ పరమఫంద। మంద ద్వంద్వ భారే ॥జాగియే॥ ౫



## శ్రీరామచంద్ర సాయంకాలకీ వందనా.

శ్రీరామచంద్రకృపాలు భజుమన। హారణ భవభయ దారుణం
నవకంజలోచన కంజ ముఖ కర। కంజపద కంజారుణం
కందర్ప అగణిత అమిత ఛవినవ। నీలనీరద సుందరం
పటపీత మానహుఁ తడిత రుచిశుచి। నౌమి జనక సుతావరం॥౧
భజ దీనబంధు దినేశ దానవ। దైత్యవంశ నికందనం
రఘునంద ఆనంద కందకోసల। చంద దశరథ నందనం ౨
శిర ముకుట కుండల తిలకచారు। ఉదారు అంగ విభూషణం
ఆజాను భుజ శర చాపధర। సంగ్రామ జిత ఖరదూషణం॥ 3
ఇతి వదత తులసీదాస శంకర। శేషముని మన రంజనం
మమ హృదయ కంజ నివాసకరు। కామాది ఖలదల గంజనం ౪

---

## శ్రీరామాయణకీ ఆరతీ

ఆరతి శ్రీరామాయణజీ కీ। కీరతి కలిత లలిత సియపీకీ॥
గావత బ్రహ్మాదిక మునినారద। వాలమీక విజ్ఞాన విశారద
శుకసనకాది శేష అరుశారద। బరని పవనసుత కీరతి నీకీ॥ఆరతి॥
గావత వేదపురాణ అష్టదశ। ఛవో శాస్త్ర సబ గంథన్హకోరస
మునిజన ధన సంతన్హకో సరవస। సార అంశ సమ్మతి సబహీకీ
॥ఆరతి॥

గావత సంతత శంభు భవానీ। అరుఘటసంభవ మునివిజ్ఞానీ
వ్యాస ఆదికవి వర్యబఖానీ। కాగభుశుండి గరుడకే హీకే
॥ఆరతి॥

కలిమల హారణి విషయ రసఫీకీ। సుభగసింగార భ_క్తిజువతీకీ
దళిన రోగ భవమూరి అమీాకీ। తాత మాత సబవిధి తులసీకీ
||ఆరతి||

శ్రీరామాయణకీ
ఆరతి సమా_ప్తం.

○ —— ○

ఓమ్
శ్రీరామచంద్రాయనమః
శ్రీహనుమతేనమః

## శ్రీ హనుమత్ స్తోత్రము.

గోష్ప దీకృత వారాశిం। మశకీకృత రాక్షసమ్
రామాయణ మహామాలా। రత్నం వందేఽనిలాత్మజమ్. ౧

అంజనానందనం వీరం। జానకీశోక నాసనమ్
కపీశ మక్ష హంతారాం। వందే లంకాభయంకరమ్. ౨

ఆమిషీకృత మార్తాండం। గోష్ప దీకృత సాగరమ్
తృణీకృత దశగ్రీవ। మాంజనేయం సమామ్యహమ్ ౩

ఉల్లంఘ్య సింధోస్సలిలం సలీలం
యశ్శోకక వహ్నిం జనకాత్మజాయాః
ఆదాయ తేనై_వ దదాహ లంకాం
నమామి తంప్రాంజలి రాంజనేయమ్. ౪

ఆంజనేయ మతి పాటలాననం
కాంచనాద్రి కమనీయ విగ్రహం
పారిజాతతరు మూలవాసినం
భావయామి పవమాన నందనమ్ ౫

యత్రయత్ర రఘునాథ కీర్తనం
తత్రతత్ర కృత మస్తకాంజలిమ్
బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్. ౬

మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూధముఖ్యం
శ్రీరామదూతం శిరసానమామి॥ ౭

అతులిత బలధామం స్వర్ణశైలాభ దేహం
దనుజ వనకృశానుం జ్ఞానినామగ్రగణ్యమ్
సకలగుణ నిధానం వానరాణామధీశం
రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి. ౮

— ○ —

శ్రీశంకర భగవత్పాద కృత

శ్రీహనుమత్పంచరత్న స్తోత్రమ్.

వీతాఖిల విషయేచ్ఛం। జాతానందాశ్రు పులకమత్యచ్ఛమ్,
సీతాపతి దూతాద్యం। వాతాత్మజ మద్య భావయే హృద్యమ్ ౧

తరుణారుణ ముఖకమలం। కరుణారస పూరపూరితాపాంగమ్.
సంజీవన మాశాసే। మంజుల మహిమాన మంజనాభాగ్యమ్ ౨

శంబర వైరి శరాతిగ। మంబుజదళ విపుల లోచనోదారమ్,
కంబుగల మనిలదిష్టం। బింబజ్వలితోష్ట మేక మవలంబే. 3

దూరీకృత సీతార్తిః। ప్రకటీకృత రామవైభవస్ఫూర్తిః
దారిత దశముఖ కీర్తిః। పురతో మమ భాతుహనుమతో మూర్తిః
వానర నికరాధ్యక్షం। దానవకుల కుముద రవికర సదృక్షమ్
దీన జనావన దీక్షం। పవనతపః పాకపుంజ మద్రాక్షమ్ ౫

ఏతత్పవనసుతస్య స్తోత్రం। యః పఠతి పంచరత్నాఖ్యమ్
చిర మిహ నిఖిలాన్ భోగాన్ భుంక్త్వా శ్రీరామ భక్తిభా
గ్భవతి.

ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద
కృత శ్రీహను మత్పంచరత్న
స్తోత్రం సంపూర్ణమ్.

— ౦ —

శ్రీరామ చంద్రాయనమః
శ్రీహనుమతే నమః

శ్రీహనుమాన్ చాలీసా

శ్రీగురు చరణ సరోజరజ। నిజమన ముకుర సుధారి
వరణౌం రఘువర విమలయశ। జోదాయక ఫల చారి,

బుద్ధి హీనతను జాన్కై । సుమిరౌ పవన కుమార్
బలబుధి విద్యా దేహు మొహి। హరహు కలేశ వికార్.

చౌపాయీ

1. జయ! హనుమాన! జ్ఞానగుణసాగర!
జయ! కపీశ! తిహుంలోక వుజాగర!

2. రామదూత! అతులిత బలధామా!
అంజనిపుత్ర! పవన సుతనామా

3. మహావీర విక్రమ – బజరంగీ
కుమతి నివార! సుమతి కే సంగీ!

4. కంచన వరణ విరాజ సువేశా
కాననకుండల కుంచిత కేశా!

5. హాథ వజ్ర అరు ధ్వజా విరాజై
కాంధేమూంజ జనేవూ ఛాజై

6. శంకర సువన! కేసరీ నందన!
తేజ ప్రతాప మహా జగ వందన!

7. విద్యావాన గునీ అతిచాతుర
రామకాజ కరివేకో ఆతుర.

8. ప్రభు చరిత్ర సుని వేకో రసియా
రామలఖన సీతా మనబసియా

9. సూక్ష్మరూప ధరి సియహిందిఖావా
వికటరూప ధరి లంక జరావా.

10. భీమరూప ధరి అసుర సంహారే
రామచంద్రకే కాజ సంవారే.

11. లాయ సజీవన లఖన జియాయే
శ్రీరఘువీర హరషి పుర లాయే

12. రఘుపతి కీన్హీ బహుత బడాయీ
కహా భరత సమ తుమ ప్రియభాయీ

13. సహసవదన తుమ్హారో యశ గావైఁ
అస కహి శ్రీపతి కంఠ లగావైఁ.

14. సనకాదిక బ్రహ్మాది మునీశా
నారద శారద సహిత అహీశా.

15. యమ కుబేర దిగపాల జహాఁతే
కవికోవిద కహి సకె కహాఁతే.

16. తుమ ఉపకార సుగ్రీవహిఁ కీన్హా.
రామ మిలాయ రాజపద దీన్హా.

17. తుమ్హారో మంత్ర విభీషణ మానా
లంకేశ్వర భయే సబ జగజానా.

18. యుగ సహస్ర యోజన పరభానూ
లీల్యోతాహి మధుర ఫల జానూ

19. ప్రభుముద్రికా మేలి ముఖ మాహీఁ
జలధి లాంఘి గయే అచరజ నాహీఁ.

20. దుర్గమ కాజ జగతకే జేతే
సుగమ అనుగ్రహ తుమ్హారే తేతే.

21. రామ దు ఆరే తుమ రఖవారే
హోతన ఆజ్ఞా బినుపైశారే.

22. సబ సుఖ లహై తుమ్హారీ శరనా
తుమ రక్షక కాహూకో డరనా.

23. ఆపన తేజ సమ్హారో ఆపై
తీనోఁ లోక హాంకతే కాంపై.

24. భూత పిశాచ నికట నహిఁ ఆవై
మహావీర జబనామ సునావై.

25. నాసై రోగ హరై సబ పీరా
జపత నిరంతర హనుమత వీరా.

26. సంకటసే హనుమాన ఛుడావై
మనక్రమ వచన ధ్యాన జోలావై.

27. సబపర రామ♦రాయు సిర తాజా
తినకే కాజ సకల తుమ సాజా.

28. ఔర మనోరథ జోకోయి లావై
తాసు అమిత జీవన ఫల పావై

29. చారోఁయుగ పరతాప తుమ్హారా
హైపరసిద్ధ జగత వుజియారా

♦ తపస్వీ రాజా

30. సాధు సంతకే తుమ రఖవారే
అసుర నికందన రామ దులారే.

31. అష్టసిద్ధి నవనిధి కే-దాతా
అస వర దీన్హ జానకీ మాతా

32: రామ రసాయన తుమ్హారే పాసా
సాదర తుమ రఘుపతికే దాసా.

33. తుమ్హారే భజన రామకో భావై
జన్మ జన్మ కే దుఖ బిసరావై

34. అంతకాల రఘుపతి పుర జాయీ
జహాఁ జన్మి హరిభక్త కహాయీ

35. ఔర దేవతా చిత్తన ధరయీ
హనుమత సేయి సర్వసుఖ కరయీ.

36. సంకట హటైమిటై సబ పీరా
జో సుమిరై హనుమత బల వీరా.

37. జై! జై! జై! హనుమాన గోసాయీఁ
కృపాకరో గురు దేవకీ నాయీఁ.

ఫలశ్రుతి :-

38. తాహ శతవార పాఠకర జోయీ
ఛూటహి బంది మహాసుఖ హోయీ.

39. జోయహ పఢై హను మాన చాలీసా
హోయ సిద్ధి సాఖీ గౌరీసా

40. తులసీదాస సదా హరిచేరా
కీజై నాథహృదయ మహఁడేరా.

— ० —

దోహ

పవన తనయ సంకట హరన
మంగల మూరతి రూప్
రామ లఖన సీతా సహిత
హృదయ బసహు సురభూప్.

శ్రీహను మాన్ చాలీసా
సంపూర్ణము.

— ० —

రామ పుజారి పర ఉపకారి
మహావీర బజరంగ బలీ!

సద్ధర్మచారి సద్బ్రహ్మచారి! ॥మహా॥
జ్ఞానగుణ సాగర రూప పుజాగర! ,,
శంకర సువన సంకట మోచన! ,,
కేసరి నందన! కలిమల భంజన! ,,

రాఘవదూత! జయ-హనుమంత! ॥మహా॥
అంజని నందన! అసుర నికందన! ,,
మంగల మూరతి! మారుత నందన ,,
జయ రణధీర! జయరణ శూర! ,,
జయ బల భీమ! జయ బలధామ!

— ० —

ఓమ్. శ్రీరామ చంద్రాయ నమః, శ్రీ సాయీ సద్గురవే నమః

శ్రీ ఆంజనేయ ప్రసన్న

ప్రార్థన.

శ్రీరఘు రామ పాద సరసీరుహ। భృంగముఁ గోవిదాగ్రణిన్
మేరుసమాన ధీరు రజనీచర। కానన దావ పావకున్
ధీర పరాక్రమాన్వితు, వనేచర। నాయకు, సాధుభక్తమం
దారుని వాయునందను స। తంబు భజింతునభీష్ట సిద్ధికిన్.

వారిరాశి యెవ్వనికి గోష్పదము నయ్యె
నసుర కోటులు మశకంబులయ్యె, నట్టి
ప్రథిత రామాయణాఽనూన రత్నమాల
మకుట మణియగు శ్రీహనూమంతు నెంతు.

జానకీజాని కీర్తన సాగునెడల
నిటలతట ఘటితాంజలిపుటుఁడుఁబులకి
తాంగుఁడానంద బాష్పపూర్ణాక్షుఁడౌ, సు
రారి హంతు శ్రీహనుమంతు నామతింతు.

సాయిసద్గురు పద జలజ రజంబున
హృదయ ముకురశుద్ధి నెలమిఁబఱపి,
ధరచతుర్విధోరు పురుషార్థదంబు శ్రీ
రామ భద్రయశముఁ బ్రస్తుతింతు.

— o —

సీతా మహాదేవి హస్తంబులన్ ముద్రికన్ భక్తి నర్పింపవే?
భీకరాకారమున్ దాల్చి పెల్లార్చి రాకాసి మూఁకన్ విదా
రించి చీకాకుఁ గావించి లంకా పురంబెల్ల ఘోరాగ్ని పాల్సే
యవే? రామకార్యంబుఁ జక్కంబడన్ సల్పఁ గాఁబోవె? సంజీవ
నాద్రిన్ సమూలంబుఁ గాఁదెచ్చి. మాయావియౌ నింద్రజిత్
బాణపాతంబునన్ మూర్ఛితుండైన సౌమిత్రిఁ క్షింపవే? నీయ
సామాన్య సాహాయ్యమున్ మెచ్చి, శ్రీరామచంద్రుండు నిన్
జేరఁగాఁదీసి శ్లాఘించుచున్ "సోదరా! నీవు నాతమ్ముఁడౌ
భరత తుల్యుండ వంచెంతయున్ వేయినోళ్లన్ ప్రశంసించు
చున్ గౌఁగిటన్ బట్టి మోదింపలేదే? మహావీర! దేవర్షులే నబ్జ
గర్భాది గీర్వాణులేన్ మానులేన్ వాణియేన్ నారదుండేని
నా యాది శేషుండునేన్ దీక్షితుల్ పండితుల్ సత్కవిశ్రేష్ఠు
లెంతెంతవారేని నీసద్యశోగానమున్ జేయ నేపాటివారప్పు!
శ్రీరామ సఖ్యంబొగిన్ గూర్చి. సుగ్రీవుఁ గిష్కింధకున్ రాజుఁ
జేయించి దివ్యోపకారంబుఁ గావింపవే? నీప్రబోధంబు
మన్నించి. యా లంకకెల్లన్ విభీషణుఁడు రాజైన వృత్తంబు
లోకంబెఱుంగున్ గదే! రెండువేల్ యోజనాల్ దూర
మందున్న యాభానునిన్ దియ్యానౌ పండుగా నెంచి, లీలన్
గ్రసింపంగఁబోవే? మహాత్మా! యభిజ్ఞాన కాంతామణిఁ
జానకీ జాని నీకీయ నా ముద్రికన్ నోటియందుంచి వీఁకన్
మహాంభోనిధిన్ దాటి నావన్ననాశ్చర్యమేమున్నదో యన్న!
విశ్వంబునన్ దుర్లభంబైన కార్యంబెదేన్ గాని నీసత్త్వ

పాతేశమే యున్న సౌలభ్యమా? గాదె? సీతాపతి ద్వారపాలుం
డవీవౌదు. నీ యాజ్ఞ లేకున్న నెవ్వారికందున్ ప్రవేశింప
దుసాధ్యమౌ; నీ పదధ్యానసక్తుండు పొందున్ గదే! సర్వ
భద్రంబులన్; నీవు సంరక్షణన్ గన్నవాండెవ్వికిన్ భీతి నొందంగ
నేకార్యమో తండ్రి! నీపాటి నీవేసుమీ! నీవు గద్దించు
మాత్రన్ త్రిలోకంబులున్ దద్దరిల్లున్, మహావీర! నీ నామ
మున్ విన్నచోం బ్రేతభూతాదులున్ డాయ జంకున్ సతం
బున్, బ్రతాప ప్రభావుండవౌ నిన్ను ధ్యానించినన్ రోగముల్
వాయుం బీడల్ వినాశంబు నొందున్, మనోవాక్క్రియా
శుద్ధిమై నిన్ను సేవించు భక్తాళి బాధల్ సమస్తంబు నస్తం
గతంబౌ, మహీశావళీ మాళి రత్నంబు శ్రీరామచంద్రుండు;
యాస్వామి కార్యంబులన్ సర్వమున్ నిర్వహింపన్ సమర్థుండ
వీవే; ప్రసన్నుండవై నిన్ బ్రసన్నుం బొనర్పంగం జాల్ వాని
సర్వార్థముల్ నైళ ముజ్జీవనంబొంది సాఫల్యమౌ; సాధు
సత్పూరుషాళిన్ సతంబీవు రక్షించుచున్ దుష్ట దైతేయ
కోటిన్ విదారించుచున్ రామ భూపాలు క్షేమం బొగిన్ జూచు
చున్నాండవే, వట్టి సిద్ధుల్ నిధుల్ తొమ్మిదింటిన్ స్వభక్తా
ళికిన్ గూర్చు సామర్థ్యమున్ జానకీ దేవి నీకున్ బ్రసాదింపదే
నీయక్షీణంబు రామామృతం బెప్డు; శ్రీరామ దాసాగ్రణీ! నిన్ను
సేవించినన్ రామచంద్రుండు మోదించు జన్మాంతరో పా
తానేక పాపంబులన్ బాపి సౌఖ్యంబులన్ గూర్తు; నీవాండి
కెందెందు జన్మించినన్ రామభక్తుండునై పుట్టువుంగాంచి

యంత్యంబునన్ వాఁడు సాకేతమున్ జేరి మోదించు నయ్యా! యనన్య ప్రపత్తిన్ నిన్నుఁ గొల్చినఁ సర్వసౌఖ్యంబులఁ వానికిఁ గూర్తు వో కీశలోకేశ! నిఁ వేడినఁ సంకటంబుల్ పటాపంచలౌ, నెల్లపీడల్ నివర్తిల్లు, సంతృప్తి సంతుష్టి శాంతుల్ గనఁ నేర్తు రెవ్వారలేనిందు; జై-జై-గోసాయీ! హనూమంత! జై-సద్గురూ! దేవ! నన్నుంగటాక్షించి శ్రీరామ పాదాశ్రయుం జేయవే! మారుతీ! దీనబంధూ! ప్రసన్నాంజనేయా! నమస్తే! నమస్తే నమస్తే నమః.

— ० —

ఫలశ్రుతి :-

అతి పవిత్రమైన హనుమ చాలీసాను
భక్తినూరు మార్లు పఠనఁజేయు
వారు వైశమఖిల బంధ విముక్తులై
పరమతుష్టి శాంతిఁబడయుచుందురు.

ప్రతి దినంబీ స్తోత్రరాజమున్ జదువ
కృతమతులకు హితాభీష్టమ్ము లొదవు
శ్రీ పార్వతీ సదాశివుల సాక్షిగను
ప్రాపించుసిద్ధి సంపదలు వెల్లుగను

— ० —

ప్రసాద యాచన :-

ఈ తులసీ దాసుఁడెల్లవేళ ను
సీతా పతిచరణ సేవకుండగును;
సదయుఁడవై యుక్త సరణినన్నోమి
హృదయ మందిర విహారివిఁగమ్ము సామి!

జానకీరామ లక్ష్మణ సహితుఁడవయి
యెల్ల దేవతల్ గొలువ నాహృదినినిలవె!
వ్యసన సంకట పన్నగ వైనతేయ!
అఖిల మంగళకాయ! శ్రీయాంజనేయ!

శ్రీతులసీదాసు చెలిమి నీ హనుమ
సీతా దయితుపదాశ్రితుఁడని ప్రేమఁ
బఱపి యీతనిహృది వసియింపుమోయి!
శరణాగతత్రాణ చరణ శ్రీసాయి!

శ్రీ హనుమాన్ చాలీసా స్తోత్ర దండకములు
సర్వము సమాప్తము

శ్రీరామచంద్రార్పణమస్తు।
లోకాస్సమస్తా స్సుఖినోభవంతు।
ఓమ్ తత్ సత్.

— ೦ —

ఓమ్

శ్రీ కృష్ణ పర బ్రహ్మణేనమః

# శ్రీ కృష్ణబోధామృతసారము

## (అష్టాదశశ్లోకీ గీతా)

సర్వోపనిషదోగావో దోగ్ధాగోపాలనందనః
పార్థోవత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

గోవులుపనిషత్సంతతి
గోవిందుఁడు దోగ్ధ. లేఁగకుంతిసుతుఁడు, స
ద్ధీవరుఁడుభోక్త, దుగ్ధము
పావన గీతామృతంబు పరమసుఖదమౌ.

ద్వాపరయుగాంతమందు భగవానుఁడు శ్రీకృష్ణుఁడుగ నవతరించి, యెల్లరు తరించుటకు చక్కనిమార్గము నిర్దేశించి నాఁడు. వేదములందలి జ్ఞానకాండమగు ఉపనిషత్తులు అన్నియు గోవుగను-అర్జునుని లేఁగ (దూడ) గను జేసి శ్రీకృష్ణుఁడను గొల్లడు వివేకియగు భోక్తకొరకు 'గీతామృతము'-అనుక్షీరమును పితికినాఁడు.

ప్రపంచమునఁగల సకలమత వాఙ్మయసారము వేదవ్యాసుని "బ్రహ్మసూత్రములు" శ్రీ మద్భగవద్గీతలు ఆబ్రహ్మసూత్రములకు-చక్కనివివరణము. ప్రపంచమున జనించిన ప్రతిజీవియు దుఃఖరాహిత్యము నిత్యసుఖమును గోరుచుండును. జీవి యేవిధమున ప్రాకులాడినను సుఖప్రాప్తికొఱకేకాని,

దుఃఖము కోరికాదు. కాని, అన్ని జీవులు సుఖమును పొందుచున్నవా?- పొందుటలేదు. కారణము "ఉపాయోపేయము" లందుఁ సమ్యగ్దృష్టి-' (చక్కనిచూపు) - వివేకము లేకపోవుట. జీవి దుఃఖనివృత్తినిపొంది శాశ్వతసుఖమును బడయుటకు చక్కనిమార్గము భగవద్గీతలందు నిర్దేశింపఁబడినది.

ఆహారనిద్రా భయమైథునములు సకలజీవులకు సామాన్యమే. కాని, మానవునియందు విశేష మొకటికలదు. అది "వివేకము"- యుక్తాయుక్త విచక్షణము - ఏదితగును, ఏది తగదు, అని తెలిసికొను తెలివి మానవునకు భగవానుఁడు ప్రసాదించినాఁడు. దానిని పెంపొందించుకొని, మనుష్యుఁడు జీవితమున సరియగు మార్గమునసుసరించి సచ్చిదానంద ధామమును పొందవలయును.

మానవునకు చక్కనిమార్గమును నిర్దేశించు గ్రంథసముదాయములో "శ్రీమద్భగవద్గీతలు" ఉత్తమోత్తమము. దానినిమించు గ్రంథమిప్పటికిలేదు- ఇఁకముందుఁ గలుగఁ బోదు- అనిన సత్యదూరముకాదు. ఈగ్రంథము పదునెనిమిది అధ్యాయములు- (లేక) ప్రకరణములుగ విభజింపఁబడినది. ఈ 18అధ్యాయములందు మొత్తము 700 శ్లోకములు కలవు. ఈగ్రంథములోని ఒక్కొక్క అధ్యాయమునుండి ఒక్కొక్క శ్లోకమును గొని, "అష్టాదశశ్లోకీ - భగవద్గీతా"- అని మన పూర్వులేర్పరచినారు. ఇది అనుశ్రుతముగ పారాయణము గావింపఁబడుచున్నది. ఈ అష్టాదశశ్లోకీ గీతలందలి భావమును

పరిశీలించి యిందు ద్యోతకమగు శ్రీ మద్భగవద్గీతా హృదయ మును గ్రహించుటకు ప్రయత్నించుదము.

మొదటి అధ్యాయమును ఉపక్రమణికగ మనము గ్రహింపఁదగును. ఇందు నిత్య సత్య సుఖముఁ బొందుటకుఁ దగినవాఁ డెవఁడు?- అను విషయము తెలుపఁబడినది. జీవికి తొలుత విరక్తి (వైరాగ్యము) అవసరము. ప్రపంచమున గోచరించు సకలవస్తు సమూహముయొక్క అనిత్యత్వమును గుర్తింపవల యును.

శ్రేయస్కాముఁడు తాను గావింపఁదగిన కార్యము లందు సరియగు విధానము నెఱుఁగకున్నను, సకలము-తుదకు ప్రాణములనుసైతము పరిత్యజించుటకు సిద్ధపడవలయును. అనఁగా తన జీవితముపైన గాఢ విరక్తి కలిగినగాని, జ్ఞానోప లబ్ధి కతఁడు తగినవాఁడు కాఁజాలఁడు. అట్టి నిశ్చల వైరాగ్య ముఁగలవాఁడే దైవాభిముఖుఁడు కాఁగలఁడు. మహాపురుష సంశ్రయము పొందఁగలఁడు. సమ్యగ్బోధనొందుటకుఁ దగిన పాత్రతఁ బడయుఁగలఁడు. భగవద్గీతలందు ప్రథమాధ్యాయ మున అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ బలికినది గమనింపుఁడు !

1. అర్జున విషాద యోగము—అర్జునుఁడు పలుకుచున్నాఁడు.

నకాంక్షేవిజయంకృష్ణ! నచరాజ్యం సుఖానిచ
కింనోరాజ్యేన గోవింద! కింభోగైర్జీవితేనవా.

కోరను విజయంబుఁ గోరను రాజ్యంబుఁ
గోర సుఖము నేని వారిజాక్ష !
ఏమి ఫలము నాకు నీ రాజ్యమున, భోగ
ములను నేమి ? బ్రతుకు వలన నేమి ?

(శ్రీమద్భగవద్గీతామృతము 1-32)

అని నిర్వేదపడినాఁడు అట్టి నిర్వేదము - అట్టి విరక్తి దుఃఖనివృత్తిని - పరమసుఖమును అపేక్షించు జీవికి అవసరమని విదితమగుచున్నది.

అర్జునుఁడటుల పలుకుటలో నతఁడు "దేహాత్మబుద్ధి"- అనఁగా దేహమే తాను అనుబుద్ధి - గలవాఁడని తెలియుచున్నది. తాను పరాక్రమవంతుఁడనని - తన పరాక్రమముచే రాజ్యమును సంపాదింపనున్నవాఁడననియు, తాను యుద్ధమున వధింపవలసియున్నవారు తనబంధువులు - తాతలు - తండ్రులు, మామలు, సోదరులు, గురువులు మొదలగువారనియు, అట్టి బంధు గురు జనవధ తనకు శ్రేయస్కరము కాఁజాలదు - అను విచారము అర్జునునకుఁ గలిగినది. ఈ విచారము రాజ్యభోగములయెడ విరక్తికి మూలమై తుదకు బ్రతుకుపైనను విరాగము కలిగించినది.

అట్టి గాఢవిరక్తి గలిగి సమర్థ సద్గురువును మహాపురుషుని సమాశ్రయించి జీవికి ఆ సద్గురువు తొలుత "ఆత్మనిత్యాత్వమును" గూర్చి బోధించును. సకల సన్మతనైతిక పథము

లందు "ఆత్మనిత్యత్వము" మూలసిద్ధాంతము- (పునాది) గ
ప్రతిపాదింపఁబడినది. వివిధ పరిణామములను (మార్పులను) పొందు ప్రకృతినే ఆత్మగా భావించిన మన నైతిక మూల సిద్ధాంతమునకు విలువయేయుండదు. దాని యునికికే మోసమగును. కావున ఆత్మనిత్యత్వమును భగవానుఁ డిటుల ప్రతిపాదించినాఁడు.

2. సాంఖ్యయోగము—భగవానుడు పలుకుచున్నాఁడు.

న జాయతే మ్రియతే వా కదా చి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.

ఆత్మ శాశ్వతుఁడు, పురాణుఁడచలుఁ డజుఁడు,
పుట్టఁడెప్పుఁడు, గిట్టఁడు, పుట్టి మరలఁ
గలుగఁడీకారణంబున కాయములును
హతములగుచున్న నీతఁడు హతుఁడుకాఁడు.

(శ్రీ మద్భగవద్గీతామృతము 2-20)

ఇటుల ఆత్మనిత్యత్వము ప్రతిపాదింపఁబడినది. పుట్టుట—గిట్టుట మొదలగునవి ప్రకృతరూపమగు దేహమునకు సంబంధించినవి కాని, దేహమునం దధిష్ఠించిన ఆత్మ కెట్టిమార్పులును లేవు.— అను విషయమును భగవానుఁ డెఱుకపఱచినాఁడు.

ఆత్మ అవినాశి_శాశ్వతుఁడు అయిన మనము ప్రపంచమునఁ జూచు జననమరణాదులు- వివిధపరిణామములు మొద

లగునవి ఎట్లు పొసఁగును? అను సందేహము కలుగవచ్చును. దానికి సమాధానముగ సత్వరజస్తమోగుణముల (త్రిగుణముల) తోఁగూడిన ప్రకృతియొక్క లీలయేకాని, వేఱుకాదు- అని, భగవానుఁడిటుల చెప్పినాఁడు.

3. కర్మయోగము :- భగవానుఁడు చెప్పుచున్నాఁడు.

తత్త్వవిత్తుమహాబాహో! గుణకర్మవిభాగయోః
గుణాగుణేషువర్తంత ఇతిమత్వాన సజ్జతే.
ఫల్గునా! గుణకర్మ విభాయోగ
తత్త్వమెఱిఁగినవాఁడు సత్వప్రముఖ, గు
ణములు చరియించుచుండు, గుణములనుచు
ఆత్మఁదలపోసి యాసక్తినందఁడెపుడు.

(శ్రీమద్భగవద్గీతామృతము 3-29)

జ్ఞానియగువాఁడు విశ్వమునగోచరించు వివిధ పరిణామములు త్రిగుణాత్మకమగు ప్రకృతివిలాసమని గుర్తించి దానియందాసక్తి నొందఁడు. మనకు గోచరించు తనువులు త్రిగుణమయమగు ప్రకృతియొక్క వికారము. పుట్టుట గిట్టుట పలు విధములగు మార్పులు పొందుట ప్రకృతికార్యమేకాని, ఆత్మ కార్యముకాదు.

అట్లయిన నిదియంతయు ప్రకృతిలీలయని తలంచి, మనము నిష్క్రియులమై సోమరులవలె నుండుటయేనా? - అను సందేహము వారించుటకు ఈ ప్రకృతిలీలయందు ద్వివిధతీవ్రావస్థలకు- (ఆసక్తివహించుట- ఆసక్తివహింపకుండుట) దూరముగ నుండుటయే జ్ఞాని చేయఁదగినది.

బ్రహ్మము అనువస్తువు ఎక్కడో మనకు దూరముగ నున్నది- అని యెఱిఁగి యజ్ఞాది కర్మములను మనమునిర్వర్తించిన మాత్రమునచాలునా అను సందియమును నివారించుటకు భగవానుఁడిట్లు తెలిపినాఁడు.

బ్రహ్మము మనకు దూరమునలేదు. బ్రహ్మపదార్థము మనకు దూరమున దగ్గఱకలదు, ఆ బ్రహ్మము ఈదృశ్యప్రపంచవస్తు సమూహమునందంతటను- దీని కావలనుకలదు. దైవ మెక్కడో ఆకసమున కావలనున్నాఁడని తలంచువాఁడు తాను కావించు ప్రపంచకర్మకలాపములందు వ్యామోహితుఁడగుచున్నాడు. తాను కావించు సకలకార్యములందును దైవమును గుర్తింపఁగలవాని జీవితము మిక్కిలి యొప్పిదమై యుండును. ఈ సకలమున దైవమునుజూడ నేర్చినవాడే జ్ఞాని-

5. కర్మసన్న్యాసయోగము- భగవానుడు పలుకుచున్నాడు.

విద్యావినయసంపన్నే-బ్రాహ్మణేగవి హస్తిని
శునిచైవశ్వపాకేచ పండితాస్సమదర్శినః
వినయవిద్యలుగలిగిన విప్రునందు
గోవునందునేనుఁగునందుఁ గుక్కయందు
నట్టిదిభుజించుచండాలునందుఁదుల్య
భావమునుగల్గువారలే ప్రాజ్ఞులనఘ।

(శ్రీమద్భగవద్గీతామృతము 5-18

అట్టి సమదృష్టి నలవరచుకొను విధానమేది ? అది సాధ్యమా? ఈ దృశ్యప్రపంచమునందు వివిధభిన్నప్రవృత్తులు గల జీవములున్నవి. ఇట్టి వీని యందన్నిటను సమానదృష్టినొందుట సాధ్యమా? అను సందేహముకలుగవచ్చును. ఆ భేదములను రూపుమాపుటకుఁగాని, విస్మరించుటకుఁగాని అలవికాని మాట నిజమే. కాని, యీ విశ్వమునఁ బొడకట్టు భిన్నత్వమునందేకత్వమును గుర్తించుటకు మన మభ్యసింపవలయును.

6. ఆత్మసంయమయోగము. భగవానుఁడు పలుకుచున్నాఁడు.

శనైః శ్శనైరుపరమేద్బుద్ధ్యాధృతిగృహీతయా
ఆత్మసంస్థంమనః కృత్వాపకించిదపిచింతయేత్.
ఇద్ధచారిత్రః ధృతిచే గ్రహింపఁబడిన
బుద్ధిఁగని యోగి యుపరతిఁబొందవలయు:
మనసుమెల్ల మెల్లగ నాత్మనునిచి యితర
మేదియైననులోనఁ జింతింపరాదు.

(శ్రీమద్భగవద్గీతామృతము 6-25)

అటులయిన వేదాంతశాస్త్రము మనల నిష్క్రియులగను స్తబ్ధులుగను జడులుగనుండుఁడని నియమించుచున్నదా?- అనుసంశయము నివారించుటకు భగవానుఁడిటుల ప్రవచించినాఁడు.

"నకించి దపిచింతయేత్"- అని పై శ్లోకమునఁ దెలుపఁబడినది. అనఁగా దైవమునకంటెనే యితరమును చింతింపరాదనిభావము. ప్రతివస్తువునందు మన మాదైవమునే చూడనేర్వవలయునని, మన తలంపులను దైవాభిముఖములఁ గావించు దైవమునందు లయమొందవలయుననిభావము. మానసికవాచక కాయికములగు వ్యాపారములను దైవపరముఁ గావింపవలయును- మనస్సుయొక్క చంచలస్వభావమును మెల్ల మెల్లగ నిగ్రహించి దైవమునందు నిలుపవలయును. అనఁగామనస్సును ఆత్మనిష్ఠితముఁ గావింపవలయును.

మన తలంపులను ఆత్మపరముఁ గావించుటెట్లను సందేహము పొడమవచ్చును. వాస్తవముగ ఆత్మసన్నిధిచేతనే తలంపులుగలుగును. ప్రకృతియందు చిత్తముయొక్క యునికి మిక్కిలి చిత్రమైనది. అది తలంచునది- తలంపఁబడునది రెండును అగుచున్నది. కావున తలంపులు దైవమునందు హత్తుకొని దైవికములగుచున్నది. సముద్రమునందు తరంగములొకదానితోనొకటి ఢీకొని సముద్రమునందైక్యమగు విధమును మనమిట గ్రహింపఁదగును. ధ్యాన సౌలభ్యముకొరకై దైవశక్తి (ప్రకృతి) యీ క్రిందివిధమున వివరింపఁబడినది.

7. విజ్ఞానయోగము- భగవానుఁడు తెలుపుచున్నాఁడు.

భూమిరాపోఽనలో వాయుఃఖంమనోబుద్ధిరేవచ
అహంకారఇతీయంమె భిన్నాప్రకృతిరష్టథా

అవనియునుజలంబు హవ్యవహుండును
మారుతమునభంబు మానసంబు
బుద్ధ్యహం కృతులనఁబొలుచు నెన్మిదివిభే
దముల నాదుప్రవృతి; అమలహృదయ!

(శ్రీమద్భగవద్గీతామృతము 7-4)

ఇందుఁ దెలుపఁబడినవి స్థూలములుకావు తన్మాత్రపంచ భూతములుగ గ్రహింపఁదగును. అహంకారము మనస్సునకు కారణము. అహంకారకారణము బుద్ధిమహత్తత్వము. ఇది అవిద్య అజ్ఞానముతోఁగూడిన అహంకారమగును. విష ముతోఁగూడిక అన్నమును "విషము" అని చెప్పఁబడునటుల వాసనాసహితమూలకారణము "అహంకారము" అని చెప్పఁ బడుచున్నది

ఈ అహంకారమే లోకమున సకలమునకు ప్రవృత్తి బీజము. ఈశ్వరసంబంధమైన మాయాశక్తి ఇట్లెనిమిది విధము లుగఁగలదు.

ఈ యెనిమిది విధములగు ప్రకృతియందు దైవమును గాంచుటయెట్లు?-

అనుసందేహ మిక్కింది విధముగ నివారింపఁబడినది. లోకుల చైతన్యమొక్కటే యగునట్లు శాస్త్రప్రకృతి వికారములుఁ గూడనొక్కటియే. ఆత్మ-జడప్రకృతి సంయోగమే యీ "సృష్టి" కావున సర్వవ్యాపకమగు దైవమును ప్రకృతియందు

(అష్టవిధములగు ప్రకృతియందు) సగుణబ్రహ్మముగ ధ్యానింప వలయును- అని భగవానుఁడు విశదపఱచు చున్నాఁడు.

అ-ఉ-మ(అర్ధమాత్రాక్షరా)'ఓమ్'బిందుసహితఏకాక్షరమే బ్రహ్మముయొక్క- సగుణరూపముసగుణబ్రహ్మము-దీనినే "ప్రణవము" అనిఅందురు. ఈశబ్దబ్రహ్మమును ఎనిమిదివిధములుగ ప్రకృతియందు గుర్తించి ధ్యానించఁదగును.

8. అక్షర పరబ్రహ్మ యోగము - భగవానుఁడు పలుకు చున్నాఁడు.

ఓమిత్యేకాక్షరంబ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యఃప్రయాతిత్యజన్‌దేహం సయాతి పరమాంగతిమ్.
అర్జునా: "ఓమ్మ"నెడి యేకాక్షరమగు
బ్రహ్మముచ్చరించుచు, నిజస్వాంతమందు
ననుస్మరించుచు నెవ్వాఁడుతనువువిడుచు
నాతఁడొందు నత్యుత్తమమైనగతిని

(శ్రీమద్భగవద్గీతామృతము 8-13)

ప్రణవరూపముగు బ్రహ్మయే యీవిశ్వము. ఎనిమిది విధములుగఁబైనఁదెలుపబడిన ప్రకృతియందు ఈశబ్దబ్రహ్మమును గుర్తించి ధ్యానించువాఁడు. పరమపదముఁ బడయునని భగవానుఁడు తెలిపినాఁడు.

అటులయిన దైవనామ చింతనముతో కాలముఁగడపు వాఁడు ఈ ప్రపంచమునఁనెట్లు బ్రతుకగలడు ?- అను సంశయ

మీా క్రిందివిధమున వారింపఁబడినది. దైవమునెఱుఁగఁగలిగిన వాఁడీ ప్రపంచమునుగూర్చి విచారపడఁడు. వానికీలోక విచారముతో సంబంధములేదు. ఉదాహరణమునకు ప్రాతఃస్మరణీయలు- పూతచరిత్రలగు గోపికల వృత్తమును గమనింపుడు!

వారివారిగృహకృత్యములఁగూర్చిఁ వారికెట్టివిచారము గలుగలేదు. ఇంటిపనులు కలవు అను స్పృహయె వారికిలేదు. వారలమనస్సు 'మధురరాశి'యగు శ్రీకృష్ణునందేలయించినది. కాని వారిగృహకృత్యములేవి యేనియునాగినవా?- ఆగలేదు. సర్వనియంతయు- సర్వవ్యాపకుఁడగు శ్రీకృష్ణుఁడె తనభక్తుల కార్యభారములఁబూని యెట్టిలోటు నెవరికిఁ గలుగనీయక నిర్వర్తించినాఁడు.

9. రాజవిద్యారాజగుహ్యయోగము- భగవానుఁడు పలుకుచున్నాడు.

అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమంవహామ్యహమ్.
ఇతరమేదియుఁదలఁపక యెవరునన్ను
జింత సేయుచు మదినుపాసించుచుందు
రట్టి నిత్యాభియుక్తులు నైనవారి
కెపుడు విహితయోగక్షేమ మేనయిడుదు.

(శ్రీమద్భగవద్గీతామృతము 9-22)

గోపికలు శ్రీకృష్ణుని గాఢముగఁ బ్రేమించి తదేకచింతనపరులై శ్రీకృష్ణునందులయించి, యైక్యత పొందఁగలిగిరి.

అట్టి అనన్యభక్తులయోగక్షేమభారమును దైవమేవహించి తీరును. బృందావనమునతనవారలగు గోపికలఁగూడిరాసక్రీడల శ్రీకృష్ణుఁడు సలుపుచునేయుండియు ఆయాగోపికలరూపముల వారివారిగృహములందు సకలకార్యములను నిర్వర్తించుచునే యుండెను.

సర్వవ్యాపియగు అష్టవిధ ప్రకృతిరూపమునయున్న వానిఁగ ధ్యానించి పూజించి స్మరించుదుమేని, ఆ నిర్గుణుఁడు నిరాకారుఁడు విశ్వవ్యాపకుఁడగు భగవానుని ప్రాకృతుఁడు, సగుణుఁడు, ఏకదేశగతునిఁగ మనము కావించుటలేదా! అను సందేహము ఈక్రిందివిధమున వారింపఁబడినది. దైవము ప్రాకృతుఁడుగఁ గావింపఁబడుచున్నాఁడనియు, ప్రకృతిస్థాయికిఁ గొనిరాఁబడెనని మనము తలంచరాదు. ఈ విశ్వమే ప్రకృతియె దైవముయొక్క సగుణరూపము. జ్ఞానియగువాఁడు దైవమునీ ప్రకృతియందు ప్రతిబింబించినటులఁ గాంచుచుండును. ఈప్రపంచమును దైవదృష్టినిఁ జూచునేకాని ప్రపంచదృష్టితోఁజూడఁడు. ఈ దృశ్యప్రపంచమును ప్రపంచముగజూడఁడు ఆదైవమే యిన్నివిధముల గోచరించుచున్నటుల గుర్తించును. నీరు - అల - నురుగు అను మూఁటియందు నెట్టిభేదముఁలేదో, ఘటము లోని ఆకాశమునకును, వెలుపలనున్న ఆకాశమునకు నెట్టిభేదములేదో అవిధముగనే ప్రకృతి- దైవములకు భేదములేదు. అని జ్ఞాని గుర్తించును.

అటులయిన- ప్రకృతి ఈశ్వరునకు భిన్నముకానియెడల ఆ ప్రకృతిదైవము నెట్లావరింపగలదు?- అను సందేహము వారింపబడినది. ప్రకృతిదైవమునకు భిన్నముకాకున్నను దైవముతోడి "ఐక్యత లేదు. అనఁగా దైవముతో సమానమగు వ్యాపకత్వములేదు, దైవముయొక్క (ఏకదేశగత) ఆకారమే ఈప్రకృతి- దృష్టిగోచరమగువిశ్వము. తక్కినది యీ ప్రకృతికి అతీతమైయున్నది. అది పలుకులచే వివరించుటకు మనస్సుచే నూహించుటకు సాధ్యముకానిది. వేదములసైతము "ఇట్లు"- అని వివరింపఁజాలక "నేతి"-"నేతి" (న-ఇతి;న-ఇతి)ఇదికాదు- ఇదికాదు- అనినిషేధశబ్దరూపమునఁ దెలుపుచున్నవే కాని, "ఇదమిత్థం" (ఇదియిట్లె) అని, నిరూపింపఁజాలకున్నవి. దైవముయొక్క ఏస్వల్పభాగమో ఈప్రకృతిరూపమున ద్యోతకమగుచున్నది. తక్కినదంతయు దీనికతీతమై యీ ప్రకృతికి ఆవల వ్యాపించియున్నది.

10. విభూతియోగము- భగవానుడు పలుకుచున్నాఁడు.

అథవా బహునైతేన కింజ్ఞాతేన తవార్జున
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితోజగత్
వినుమి! యటుఁగానిచో బహువిధమునైన
యిట్టిజ్ఞానంబుచేత నీకేమి సార్థ
కంబు? నే నీ సమస్తజగంబు నిలుపు
కొనుచునుంటి నా యేకాంశమున నె; పార్థ!

(శ్రీ మద్భగవద్గీతామృతము 10-42)

ఆ దైవమును యథార్థముగ నెఱుంగుటకు ఇంతకుం బూర్వముం దెలుపంబడిన కర్మజ్ఞానాది మార్గముల నన్నిటియం దునే మార్గసులభమగును? అను ప్రశ్నమునకు సమాధానముగ భక్తియే మిక్కిలి సులభమార్గమని భగవానుండు విస్పష్టము గావించినాండు. బాహ్యాడంబరములకంటె నంతః ప్రవృత్తికిం బ్రాధాన్యమిచ్చినాండు. భక్తుడగువాండు త్రికరణములం (మానసిక-వాచిక-కాయకముల) బరిశుద్ధి సంపాదింపవలయును. అట్టివాండె తనకు ప్రియుండని భగవానుండు తెలిపినాండు.

12. భక్తియోగము- భగవానుండు పలుకుచున్నాండు.

అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనోగతవ్యథః
సర్వారంభ పరిత్యాగీయోమద్భక్తస్సమే ప్రియః
దక్షుడును విశుద్ధుండనపేక్షుండు మఱి
భయవిరహితుండు నిష్పక్షపాతరతుండు
సర్వసంకల్పరహితుండై సంచరించు
నాదుభక్తుండు ఫల్గునా! నాకు బ్రియుండు.

(శ్రీ మద్భగవద్గీతామృతము 12-16)

త్రికరణశుద్ధిగగలిగి, సర్వభూత హితరతుండై నాయందు భక్తిచేయువాండు నాకుప్రియుండు అని శ్రీకృష్ణుండు స్పష్టపరచినాండు.

వివిధకర్మ లాచరించుచు జీవయాత్ర జరుపువాండెట్లుల నిర్లిప్తుండు కాంగలడు? అను సందేహ మీ క్రిందివిధమున వారింపంబడినది. "ఆకాశము" సూక్ష్మత్వ కారణమున ప్రత్య

ణువునందు వ్యాపించియేయున్నది. అట్లుండియు దేనిచేత నంటఁబడుటలేదు. ఆ విధముగ ఆత్మయు నిర్లిప్తమైయున్నది. ఆత్మ అను వస్తువుల పెట్టెయందుంచబడిన వజ్రమువంటిదికాదు. దేహాదివికారములద్వారా కావింపఁబడు వివిధకర్మలచేత ఆత్మ యెన్నఁడు నంటఁబడదు. ఆత్మ సత్తామాత్రముననే యీ దేహేంద్రియములు వివిధకర్మములందుఁ బాల్గొనుచు నిర్వర్తించుచున్నవి. సకలభూతములకు 'నియంత' ఆత్మ.

13. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము-భగవానుఁడు పలుకుచున్నాడు.

యథాసర్వగతం సౌక్ష్మ్యాదాకాశంనో పలిప్యతే
సర్వత్రావస్థితోదేహేతథాఽఽత్మానో పలిప్యతే.
అన్నియెడలనిండి యాకాశమతి సూక్ష్మ
మగుటనెద్దియేని నంటకుండు
తీరునను సమస్తదేహంబులందున్న
ఆత్మదేనిఁగాని నంటకుండు

(శ్రీ మద్భగవద్గీతామృతము 13-33)

జ్ఞానియగువానికి త్రిగుణాత్మకమగు ప్రకృతి ప్రతిబంధకము కానేరదు. అతఁడు త్రిగుణములను స్వీకరింపఁడు- నిరాకరింపఁడు. జ్ఞాని చిత్తమందే లయమొందియుండు కారణమున ఈత్రిగుణములున్నను లేకున్నను అతని కెట్టి హానియు లేదు.

14. గుణత్రయ విభాగయోగము- భగవానుఁడు పలుకుచున్నాడు.

దేహములందు వివిధములుగ ఆ ఆత్మవస్తువున్నటులఁ బొడ కట్టుచున్నను ఇన్నిట నధివసించినది. ఆ ఏకము-అద్వితీయమగు ఆత్మయె. కావున ఆ "ఆత్మ"-"వైశ్వానరుఁడు"- అని చెప్పఁ బడుచున్నాడు.

15. పురుషోత్తమప్రాప్తియోగము- భగవానుడు తెలుపు చున్నాఁడు.

అహంవైశ్వానరో భూత్వాప్రాణినాందేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నంచతుర్విధమ్.

పాండవోత్తమ ! వైశ్వానరుండనగుచు
ప్రాణికోటి శరీరంబు లాశ్రయించి
ప్రాణమునపానముగూడి నేను పక్వ
మాచరించుచుందుఁ జతుర్విధాన్నములను.

(శ్రీ మద్భగవద్గీతామృతము 15-14)

ఈ ప్రకృతి పురుషుల సంబంధమును గుర్తింపజాలిన వాఁడు- ప్రకృతి బంధమునుండియే స్వస్వరూపమును దెలిసి కొనుటకుఁ బ్రయత్నించును.

ప్రతిమానవుని హృదయమందు దైవప్రకృతికి- ఆసుర ప్రకృతికి నిరంతరము సంఘర్షణము కలుగుచునేయుండును. సత్వప్రకృతి (దైవప్రకృతి) శ్రేయోమార్గమును నిర్దేశించుచునే యుండును. రజస్తమో ప్రకృతులు (ఆసురప్రకృతి) పెడదారుల కీడ్చుటకు- పోనిఁగూడ్చుటకు యత్నించుచునేయుండును. భగవానునియొక్క ఆజ్ఞలే శాస్త్రములు. వానినాధారముఁ జేసి

కొని, మహాత్ములు పయనించి లోకమునకుఁ జాటిన చక్కని బాటలు శాస్త్రనిర్దిష్టములై, మహాపురుషు లాచరించి ప్రదర్శించినవియు స్వానుభవమునకు యుక్తములుగఁ దోఁచిన వానిని స్వీకరించి, ప్రపంచమున జీవయాత్ర సాగించువాఁడే పరమస్థానమును పొందఁజాలును. వీనికి విరుద్ధముగఁ బ్రవర్తించువానికి ఇహలోక సుఖములేదు- పరలోకసుఖమును కలుగఁబోదు.

16. దైవాసురసంపద్విభాగయోగము - భగవానుడు పలుకు చున్నాఁడు.

యశ్శాస్త్రవిధి ముత్సృజ్యవర్తతేకామకారతః
నససిద్ధిమవాప్నోతి నసుఖంనపరాంగతిమ్.

సవ్యసాచి! యెవఁడు శాస్త్రనియమమును
విడిచి తా యథేచ్ఛ నడుచుచుండు
నానరుండు సిద్ధినందఁడు సుఖమును
బడయలేఁడు— పరమపదముఁగనఁడు.

(శ్రీమద్భగవద్గీతామృతము 16–23)

శాస్త్రనియమానుసారము - అంతరాత్మ నిర్దేశించు విధమున ప్రవర్తించుచు మనుజుఁడీలోకమునఁనెట్లు మెలఁగవలయునో అనుసందేహము తీర్పఁబడినది ప్రపంచమున మానవులకు పరస్పర సంబంధముఁగూర్చుటకు ప్రధానమైనది "భాష" లేక "పలుకు". ఒండొరులకు సంబంధముఁ గల్పించు

నది "వాక్కు". కావున ఎట్టి వాక్కులు పలుకవలయునో వాఙ్రూపమగు తపస్సు ఎట్టిదో తెలియఁదగును.

17. శ్రద్ధాత్రయవిభాగయోగము - భగవానుఁడు పలుకు చున్నాడు.

అనుద్వేగకరంవాక్యం సత్యం ప్రియహితంచయత్
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయంతపఉచ్యతే

ఇతరులకును దుఃఖమీయనివాక్యంబు,
మదికిఁ బ్రియమునైనమాట, సత్య
మాడుటయును వేదమభ్యసించుటయు వా
ఙ్మయము నౌతపంబనంగఁబడును.

(శ్రీ మద్భగవద్గీతామృతము 17-15)

శ్రీకృష్ణభగవానునివలన సంపూర్ణముగ ఆత్మవిద్యోపదేశమునుపొంది అర్జునుఁడు "శ్రీకృష్ణా! నీ అనుగ్రహమున నానేత్రముల నావరించినమోహము అను తెరతొలఁగినది. బుద్ధి మేల్కొలుపఁబడినది. సందేహములు నివారణమైనవి. నీ ఆజ్ఞ నిర్వర్తించుటకు సంసిద్ధుఁడనై యున్నాడను"- అని, పలికెను "విముక్తి"- అననేదోయొక క్రొత్తవస్తువును తీసికొనివచ్చుట కాదు. స్వస్వరూపమును తెలియుటయే 'ముక్తి'. ఆత్మ తెలియఁగ వలసినదేకాని, మఱియొకవిధమున బోధపడదు.'కర్మము'- అనునది ప్రకృతికి సంబంధించినది. అది ప్రకృతితత్త్వమేయగు చున్నది. కాని, దానికి'సాక్షి'యైన ఆత్మకుసంబంధించినదికాదు,

18. మోక్షసన్న్యాస యోగము :- అర్జునుఁడు చెప్పు చున్నాడు.

నష్టోమోహః స్మృతిర్లబ్ధాత్వత్ప్రసాదాన్మయాఽచ్యుత
స్థితోఽస్మిగతసందేహః కరిష్యేవచనంతవ.

నీయనుగ్రహమున నెఱి నాశమొందె నా
మోహమెల్ల, స్మృతినిఁ బొందినాఁడ
సమసిపోయెసకలసందేహములు, నీవు
చెప్పినట్లు కృష్ణ! చేయనుంటి.

(శ్రీమద్భగవద్గీతామృతము 18–73)

ఇది సద్గురుబోధవలన కలుగుఫలము. సందేహములు తొలఁగి మోహము (అజ్ఞానము) నశించును. అజ్ఞానమునశించె నేని శేషించునది జ్ఞానము. జీవి మెలకువ (ప్రబోధము) పొందును. నిద్రయందున్నవాఁడేవియో భయాస్పదములగు కలలుగని దేహకంపన శోకాదులు పొందుసమయమున మేల్కొని యున్నవారతనికి మెలకువ గలిగింపఁగా నతఁడు మోహనిద్ర నుండి మేల్కొని, తన సహజస్థితిని గుర్తించి వీతశోకుఁడగును.

సద్గురుబోధవలన దేహాత్మబుద్ధి (దేహమేతాను అను బుద్ధి) లతొలఁగి జీవి తన సహజస్థితిని గుర్తించును.

దుఃఖరాహిత్యమే జ్ఞానసిద్ధి, జ్ఞానసిద్ధి నొందినపిదప జీవి తన విధ్యుక్తములను నిర్వర్తించుటయందు సందేహింపఁడు. అట్టిజ్ఞానిని బంధించునది యేదియును లేదు. వానికి సకలము సిద్ధించును.

యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ.

ఎచట యోగీశ్వరుండైన కృష్ణుఁడుండు
నెట ధనుర్ధారియౌ పార్థుఁ డెసఁగుచుండు
నచట శ్రీయును భూతి జయ ప్రసిద్ధి
నిశ్చయముగ గల్గునటంచు నేఁ దలంతు.

(శ్రీ మద్భగవద్గీతామృతము 18-73)

కల్యాణ గుణములగు శ్రీయును విజయము - భూతి (ఐశ్వర్యము) నీతి మొదలగునవి నిస్స్పృహులకు సోమరులకు నిష్క్రియులకు కలుగవు. సకల కర్మనియంతయగు సర్వేశ్వరుని చే సకలము గావింపఁబడుచున్నదను నిశ్చయ బుద్ధికలిగి అసుర ప్రకృతిని జయించుటకు నడుము బిగించి తగిన ఉపకరణములతో ముందంజవేసి, తనధర్మము నిర్వర్తించు జీవికే అట్టిసకల కల్యాణములు సిద్ధించును. సర్వఫలప్రదాత. సర్వనియంతయగు శ్రీకృష్ణుని ముందుంచుకొని, కర్మఫలాపేక్ష విడిచి, సకలముఁ శ్రీకృష్ణునిచేఁ గావింపఁబడుచున్నదను ఎఱుక గలిగి, తాను నిమిత్తమాత్రుఁడుగ భావించి, గాండీవి యైన అర్జునుఁడు విధ్యుక్తమగు క్షత్రియ కర్మమును శక్తివంచనలేక నిర్వర్తించియే శాశ్వత కీర్తి సంపదలను బడయఁజాలెను. ఆవిధముగనే మానవులు ఎల్లరు కర్మయోగనియంతయగు శ్రీకృష్ణుని ముందుంచుకొని కర్మయోగియైన అర్జునుని అడుగుజాడల పయ

నించి, వారివారి విధ్యుక్త కర్మములనాచరించి, శాశ్వత స్థితి, సుఖశాంతులను బడయుదురుగాత!

ఓమ్ తత్ సత్.

శ్రీకృష్ణార్పణమస్తు!

# ఈ రచయితచే రచింపబడి పునర్ముద్రణ కావలసిన గ్రంథములు

—o—

1. శ్రీలక్ష్మీనృసింహస్తోత్రమంజరి.
2. శ్రీమద్భగవద్గీతామృతము (శ్లోకము—తెనుగు పద్యములు)
3. శ్రీప్రబోధ, సుధాకరము (శ్రీశంకరభగవత్పాదరచిత—శ్లోకములు తెనుగుపద్యములు)
4. శ్రీకృష్ణకర్ణామృతము (శ్రీలీలాశుక సంస్కృత కృతికి— తెనుగుపద్యములు)
5. శ్రీనివాసదయాశతకము
6. శ్రీవేంకటేశ్వర సుప్రభాత గీతములు
7. శ్రీసాయీ మననము
8. శ్రీసాయీ కరుణ
9. శ్రీసాయీబాబా కూడా దేవుడేనా ? ఉన్నదేవుళ్ళు చాలకనా ? (సందేహ నివృత్తి)
10. శ్రీసాయీ కబీరుసూక్తులు
11. శ్రీసాయీ విజయము (జంగమకథ)
12. శ్రీసాయీనాథ బోధామృతము
13. శ్రీసాయీ ప్రేమకిరణములు
14. శ్రీసాయీగీత
15. శ్రీ ప్రేమామృతము (నారదభక్తి సూత్రములకు వ్యాఖ్య)